భారతము నందలి కృష్ణకథ స్వామి లౌకిక, దైవిక, తాత్త్విక కృత్యలలో నిరూపితమై ధర్మసంస్థాపనోన్ముఖముగ చిత్రితమైనదనుటకు భగవద్గీత భారతాంతర్గతమై హృదయ స్థానము నాక్రమించుట ప్రబల సాక్ష్యము. దీనిని బట్టి సమగ్ర కృష్ణకథా దర్శనమున భారత మొక విశిష్ట ఘట్టమని తెలుచున్నది.

## పురాణములు

కృష్ణకథా వివేచనమున పురాణ వాఙ్మయమునకు విశిష్ట స్థానము గలదు. పురాణము లన్నియు సర్గ ప్రతిసర్గ మన్వంతరాది విషయములను నిరూపణ మొనర్చుట చేత నిరువది యెనిమిదవ ద్వాపరమున ప్రవర్తిల్లిన కృష్ణకథా వృత్తాంతమును ప్రముఖ పురాణము లన్నియు సంగ్రహముగనో సమస్తముగనో చెప్పుచునే యున్నవి. రచనా దృక్పథమును బట్టియు, ప్రయోజనమునుఁ బట్టియు వీనిలో కొన్ని మార్పులు కనిపించు చున్నవి. మొత్తము మీద సమగ్ర కృష్ణకథా స్వరూపమునకు పురాణములే ప్రముఖమైన ఆకరము. భారతమునకు ఖిల పురాణమని భావింపఁ బడిన హరివంశము నందు పాండవులతో కృష్ణునికి గల సంబంధము పోను మిగత భాగ మంత యును సమగ్రముగ నున్నది. శ్రీకృష్ణ జననము మొదలు (అవతార సమాప్తి వృత్తాంతము పోను) సర్వ కృష్ణకథాంశములు నిందు కలవు. పరాశర ప్రోక్తమైన విష్ణు పురాణమున కృష్ణకథ సమగ్రముగ లభించును. భాగవతము తాత్త్వికముగను, భక్తి ప్రధానముగను కృష్ణకథ కొక పరమాకర్షక స్వరూపము కల్పించినది. ఆంధ్ర వాఙ్మయమునకు సంబంధించి యీ మూడు పురాణములును, మహా భారతేతిహాసమును కృష్ణకథకు మూల స్థానీయము లగుచున్నవి.[8]

బ్రహ్మ, బ్రహ్మాండ పురాణములు, పద్మ పురాణా, దేవీ భాగవతములు కృష్ణకథలోని కొన్ని ప్రత్యేకాంశములకు స్థానములై

8. విష్ణుపురాణ హరివంశముల కనేక విషయములలో సామ్యమున్నది.

యున్నవి. ఉదాహరణమునకు బ్రహ్మవైవర్త, పద్మపురాణ, దేవీ భాగవత, గర్గ సంహితాదులందు రాధాకృష్ణ దర్శనము ప్రత్యేకాంశము. విశేషించి దేవీ భాగవతమున స్వామి మానవాంశ ప్రధానముగ నిరూపితమైనది. ఇట్లే మత్స్య, అగ్ని, వాయు, కూర్మ, మార్కండేయాదు లందు యథా సందర్భములైన కృష్ణకథాంశములు కలవు. స్కాందమున సత్యభామ పూర్వజన్మ వృత్తాంతము, దుర్వాస మహర్షితో స్వామికి గల సంబంధము మున్నగు విశిష్టాంశములు గూడ నున్నవి. గర్గ భాగవతమున సమగ్ర కృష్ణ కథలో పూర్వోక్త రాధా వృత్తాంతముతో బాటు చతుర్వ్యూహ విస్తృతికి ప్రాధాన్యము కలదు. ఈ విధముగ రెండవ వర్గమునకు జెందిన యీ విశిష్ట పురాణములు సామాన్యమైన కృష్ణ కథా ప్రతిపాదన మొనర్చుచునే అందలి ప్రత్యేకాంశముల ప్రతిపాదించినవి. ఆంధ్ర వాఙ్మయమున నీ రెండవ సంప్రదాయము క్రమ వికాసము నంద లేదు.

ప్రాయికముగ పురాణము లన్నియు స్వామి దైవ మానుష తత్త్వముల నిరూపించుచు దృక్పథ వైవిధ్యమును బట్టి పాంచరాత్ర సాంఖ్యాది దర్శనములను, శ్రీవిద్యాది మార్గములను ప్రతిబింబించు చున్నవి. అయినను కృష్ణకథా విషయికముగ నందలి సర్వతోముఖ మైన సమన్వయమును బట్టి అన్నిటికిని స్థానముగలదు. నీతి, ధర్మ శాస్త్రాదుల చర్చలు, సృష్టి ప్రళయాదుల పద్ధతులు, సదాచార రీతులు, ఖగోళాది శాస్త్ర వివేచనము మున్నగు ననేక శాస్త్రములకీ పురాణములు మూలస్థానములై భారతీయ సంస్కృతిలో ప్రముఖ స్థానము నాక్రమించినవి. ప్రస్తుత సమీక్షయందు భిన్న పురాణ ప్రోక్తములైన కృష్ణకథాంశముల క్రోడీకరణము, ఆంధ్ర వాఙ్మయమున తత్క్రమ వికాస నిరూపణము మాత్రమే ప్రసక్తములు.

క్రమ వికాసము

సమస్త కృష్ణకథా స్వరూపమునకు కేంద్రము సంస్కృత భాష. అందు పూర్వోక్త ప్రకారము వైదిక వాఙ్మయము మొదలు

లౌకిక కావ్యనాటక వాఙ్మయము వరకు కృష్ణకథ బహురూపముల విస్తృతి నందినది. దేశ భాష లన్నియు సంస్కృత భాషా ప్రభావమునకు భిన్న భిన్న స్థాయులలో గురి యగుటవలన నా యీ కథావస్తువులే వీనికి నుపాదేయములైనవి. వీని యందు క్రమ వికాసములో నొక సామాన్య సూత్రము భాసించుచున్నది. తొలిదశలో వీని యందు పురాణేతిహాసముల యథామూలానువాదములు గాని, స్వేచ్ఛానువాదములు గాని వెలువడినవి. పిమ్మట నేకదేశ కథా భాగములను గ్రహించి కావ్య నాటకాది స్వరూపములలో విస్తృత మొనర్చు పద్ధతి వ్యాపించినది. అటుపై సమకాలీన పరిస్థితులవలన ప్రచలితములైన నూత్న దృక్పథములకు, సిద్ధాంతములకు స్థానము కల్పించుచు కల్పనా విశిష్టములైన నూతన సాహిత్య ప్రక్రియలు వెలువడినవి. ఈ విస్తృతి కథాతత్త్వము కేంద్రముగ జరిగినను, కవి, కాలము ప్రాధాన్యమును వహించును. ఈ సూత్రము భారతీయ భాషలన్నిటి యందు సర్వకథా సందర్భము లందును సత్యము. ఈ సూత్రమే ఆంధ్ర వాఙ్మయము నందలి కృష్ణకథకును వర్తించును. దీనినే సమన్వయ సూత్రముగ నిందు గ్రహించుట జరిగినది.

ద్వితీయాధ్యాయము

# అవతరణ పరిణామముల దిఙ్మాత్ర నిర్దేశము

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున భిన్నయుగము లందలి లక్షణములను స్థూలముగ నిర్దేశించి, తత్ఫలితముగ వెలువడిన కృష్ణకథా కావ్య రీతుల గమనించుట ఈ అధ్యాయమున ప్రణాళిక. కృష్ణ కథాంశముల క్రమ పరిణామమును పరిశీలించు నపు డాయా కవుల దేశ కాల కావ్య సంప్రదాయ స్థితులను వేరువేరుగ నిర్దేశింపనక్కర లేకయే ఆ యధ్యాయమును పఠించుట కిది యొక భిత్తికగ నుండవలె ననుట ఆశయము.

కవిత్రయ యుగము

ఈ యనుశీలనము సహజముగ నన్నయ భారతముతో నారంభమగును. శాతవాహనుల కాలము నాటికి బౌద్ధ జైనములు దేశమున నెలకొని సనాతన మతముతో సమాన స్థాయి నందుటయే గాక, దానికంటె జనరంజకములై యభివృద్ధి నందినవి. వర్ణభేద రాహిత్యము, సంప్రదాయ వ్యతిరేకత ప్రధాన గుణములైన యీ మతములు తొలుత సామాన్య జనుల నాకర్షించినను, కాల క్రమమున తాత్త్విక గాంభీర్యమును కోల్పోయినవి. అట్టి స్థితిలో సనాతన వైదిక మతము మరల తలయెత్తి వేళ్ళూనుటకు యత్నించినది. ఈ యుద్యమమున ఏడవ శతాబ్దికి చెందిన కుమారిలభట్టు, తొమ్మిదవ శతాబ్దికి చెందిన శంకరాచార్యులు జీవగర్రలై, దేశమున వ్యాపించి యున్న అనేక క్షుద్ర సంప్రదాయములను తొలగించినారు. వీరి ప్రయత్న ఫలితముగ, భిన్న భిన్న మత సంప్రదాయ ప్రచారము వలన నేర్పడిన యవ్యవస్థ నశించి వైదిక సంప్రదాయము వ్యాపించుట కనుకూల పరిస్థితులు దేశమున పెక్కు తావుల నేర్పడినవి. ఇంచుక తరువాతి కాలమున (11వ శతాబ్ది పూర్వార్థము) రాజరాజ

నరేంద్రుని సంకల్పమువలన, నన్నయభట్టు సద్యత్నమువలన, ఆంధ్రభాష యందు భారత మవతరించినది. వైదికమత స్థాపనా ధురీణులగు చోళుల మార్గము రాజరాజ నరేంద్రున కాదర్శప్రాయ మైనది. తమిళ, కన్నడ భాషలయం దప్పటికే వెలువడి ప్రచారము నందియున్న పంచమ వేదమువంటి దానిని తెనుగున వెలువరింపఁ జేయవలె నను ఆతని ధర్మ సంకల్పమునకు తన చంద్రవంశ సంభూతి దోహదమైనది. ఆర్షమత విజ్ఞానమును జనుల కందించి అవైదిక మతోద్ధతిని నిలువరింప నన్నయచేత నతడు భారతాంధ్రీకరణ చేయించెను. అనగా ఆంధ్రభాష యందలి ప్రథమ కావ్యావతరణము నకు వైదిక మతస్థాపనము కారణమని తెలియుచున్నది. నన్నయ భారతము నందలి కృష్ణకథా నిర్దేశమును గమనించినచో అదియొక ప్రత్యేకత నార్జించుకొనక, గచ్ఛన్మార్గమున సాగి వచ్చినది. వేద ప్రోక్తమైన ధర్మాభిరతియే భారతమున సాముదాయిక ప్రాధాన్య మును వహించినది.

సనాతన భావము లిట్లు నెలకొనిన పిమ్మట, వానిపై తిరుగుబాటు నెరపిన ఉద్యమము శైవసాహిత్య సృష్టి. దీనికి పూర్వరంగముగ కొన్ని చారిత్రిక విషయములు గమనార్హములు. రాజరాజ నరేంద్రుని కుమారుడైన రాజేంద్రచోళుడు క్రీ॥ శ॥ 1070లో వేంగిచాళుక్య, చోళరాజ్యముల కధిపతియై తమిళదేశమున రాజధాని నెలకొల్పి కులోత్తుంగచోళు డను బిరుద నామముతో పాలించెను. పాలనా కేంద్రము మారుటచే ఆంధ్రదేశమునకు రాజకీయ ప్రాధాన్యము తగ్గుట, తత్ఫలితముగ సారస్వత పోషణము వెనుకబడుట జరిగినది. రాజప్రతినిధిగ వేంగినాడును పాలించిన విక్రమచోళుని అసమర్థతను పురస్కరించుకొని పశ్చిమ చాళుక్యులీ ప్రాంతములకు పాలకులైరి. వారి కాలమున ఆంధ్ర వాఙ్మయమునకు రాజపోషణము లభింపలేదు. ఈ పశ్చిమ చాళుక్యుల ప్రాభవము గూడ భూలోకమల్లునితో నంతమొంది, వివిధ మండలాధిపతులు స్వతంత్రించుట, రాజకీయ,

మత కల్లోలములు పుట్టి దేశమున సంక్షోభమేర్పడుట జరిగినది. ఇట్టి స్థితిగతులలో శైవము వ్యాప్తినందఁజొచ్చినది. దీనికి ముఖ్యముగ దోహదభూతు డైనది బసవేశ్వరుడు. ఈతడు బిజ్జలుని మంత్రి. బిజ్జలుడు పశ్చిమ చాళుక్యులలో కడపటివాడగు భూలోకమల్లుని మంత్రి. ఇతడు క్రీ॥ శ॥ 1162లో చాళుక్య సామ్రాజ్యము నాక్రమించెను. ఇట్టి సన్నివేశముననే వీరశైవము విజృంభించి దేశీయభాషా ఛందములతోడి నూతన కావ్యసృష్టికి దోహద మొసగినది. వర్ణాశ్రమ ధర్మములకు దూరమై, భక్తిప్రధానమై, తీవ్రావేశముతో నిండిన శైవము ప్రజల నాకర్షించుటయే గాక, ఉద్ధతమై పరమత దమన మొనర్చినది. దీనివలన నన్నయ కొంతవర కాంధ్రీకరించి విడిచిన భారతము పూర్తి యగుటకు తగిన పరిస్థితులు లేకపోయినవి. నన్నెచోడుని కుమార సంభవము, పండితత్రయము వివిధ రచనలు, పాల్కురికి సోమన కావ్యములు, వ్యాప్తిలోనికి వచ్చినవి. కాల క్రమమున పాల్కురికి సోమన యనంతరము వీరశైవ మహోద్యమము వెనుక బట్టినది. ఈ దశలో వైష్ణవ ప్రచార ముద్దేశించి రామ కథకు ప్రజారంజక ద్విపదరూపమున ప్రాణప్రతిష్ఠ యొనర్చినది- రంగనాథ రామాయణము. దీనివలననే సురల వైదిక మత సంబంధ గ్రంథములపై నే కొలదియో ఆదరము కలిగినది. ఇందులకు చారిత్రకముగ కాకతీయ సామ్రాజ్య స్థాపనము, ముఖ్యముగ గణపతిదేవుని పరిపాలనము దోహద భూతములు. ఇది ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున తిక్కన అవతరించుటకు పూర్వరంగము. నాటికి (క్రీ॥ శ॥1210-1290) శైవము చెప్పఁదగిన శక్తిగ దేశమున వేళ్ళూని యున్నది. అప్పటికే రామానుజుల విశిష్టాద్వైత ప్రవచనము గూడ (క్రీ॥ శ॥ 11వ శతాబ్దము) దీనికి ప్రతిశక్తిగ దేశమున విస్తృతి నార్జించుకొనుచున్నది. దాక్షిణాత్య మత సంప్రదాయమునే గాక పరోక్షముగ భారతావని నంతటిని కదల్చివైచినదీ సిద్ధాంతము. కాని తన్నిరూపకములైన కావ్యములు పుట్టుటకింకను వీలైన వాతావరణము నెలకొనలేదు. వేదప్రోక్త ధర్మాద్వైత స్థితి కాలవాలమైన

భారతమువలె భక్తి ప్రధానము, శరణాగతి నిదానము నైన వైష్ణ వానుయాయుల సృష్టిదృష్టులు ప్రసరింపలేదు. దీనికి తోడు పెచ్చు పెరిగిన శైవ వైష్ణవ పరస్పర ద్వేషములు ఉభయతత్త్వముల వ్యాప్తికి భంజకములైనవి. సరిగా నీ ఘట్టముననే తిక్కన భారతాంధ్రీకరణ మును, తన్మూలమున ఆంధ్ర వాఙ్మయమున సుదూర ప్రభావమును నెరపిన హరిహరాద్వైత ప్రవచనమును జరిగినవి. హరిహరాద్వైత భావన కేవలము తిక్కనోపజ్ఞమైనది కాదు. కాని దేశ కాల పరిస్థితు లనుఁ బట్టి, వాని యవసరమునుఁ బట్టి ఒక సనాతన సిద్ధాంతమును వ్యాప్తిలోనికి తెచ్చి, దానికే తన సారస్వత ప్రతిభ నంకితము చేసి, సమాజ స్వరూపమును మార్చిన మహాకవి తిక్కన. ఇట్టి కవు లెందరో లేరు. నన్నయ కావ్య రచనా పద్ధతికి, శైవకవుల ప్రజారంజక కవితా ధోరణులకు సమన్వయము సాధించి వాఙ్మయ లోకమున నంతకు ముందున్న రెండు విభిన్న మార్గములకు భాషా సాహిత్య దృష్టిలో నితడొక సమ్మేళనము కల్పించెను భారత కథాంతర్గతమైన కృష్ణకథావిష్కృతితో ఆంధ్ర వాఙ్మయమున కృష్ణకథోదయ ప్రథమ ఘట్టము పూర్తియైన దనవచ్చును. నన్నయ భారతమున నరనారాయణ తత్త్వ ప్రతీకగ, దివ్యమానుష సంకేతముగ రూపము దిద్దుకొన్న స్వామికథ యిందు సర్వాంశముల చేకూర్చుకొని సమగ్ర మైనది. ఆంధ్ర లోకమున గతానుగతికముగ భారత కృష్ణుడని పిలువ బడిన స్వామియొక్క లౌకిక నిర్వహణచణమైన స్వరూప మొకటి తిక్కన చేతిలో ఉజ్జ్వల మూర్తిమంతమై, ఆంధ్ర వాఙ్మయమున నొక ప్రత్యేక శాఖగ విస్తరిల్లినది. తక్కిన అంశము లిందు లేవని చెప్పుట కాదు, ప్రాధాన్య వివక్షయే ప్రసక్తము. భారత రసవ దనువాదము, హరిహరాద్వైత ప్రతిపాదనము, ఆంధ్రావళి మోదము ధ్యేయములుగ గల్గిన యీ మహాకవి వాఙ్మయ యజ్ఞ ఫలితముగ సమగ్ర కృష్ణ స్వరూప మవతరించినది. శివ కేశవ విభే దములచే కలుషితమైన ఆంధ్ర సంఘము నీతడు సంస్కరించినాడు. అర్వాచీన సాహిత్య చరిత్రము నందీ విధమైన వర్గ సాహిత్యము

ప్రాయికముగ వెలువడకుండుటయు, ఒకవేళ వెలువడినను పరమతా సహిష్ణుతను ప్రదర్శింప కుండుటయు తిక్కన కృషి ఫలితములే యని చెప్పవచ్చును.[1]

పదునాల్గవ శతాబ్ది మీా యనుశీలనమున మిక్కిలి ప్రధానము. ఇందు ప్రబంధ పరమేశ్వరుడు ఎఱ్ఱన హరివంశానువాదము, నవీన గుణసనాథుడైన నాచన సోముని ఉత్తర హరివంశ రచనము ముఖ్య ఘట్టములు. తిక్కన కర్వాచీన కాలమున తురుష్కుల దండయాత్ర ఫలితముగ కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది, సామంతు లనేకులు స్వతంత్రులై రాజ్యపీఠముల స్థాపించిరి. అట్టి వారిలో పద్మనాయకులు, రెడ్డిరాజులు ముఖ్యముగ చెప్పదగినవారు. హరిహరరాయలు బుక్కరాయలు తుంగభద్రా తీరమున నొక రాజ్యమును స్థాపించిరి. మహమ్మదీయులు గూడ ఏలికలైరి. ఆ యా పరిస్థితుల ఫలితముగ దేశమున మరియొకసారి కల్లోల పూరితమైన వాతావరణము నెలకొనినది. ప్రాయికముగ

---

1. పాల్కురికి సోమనాథుని రచనా పద్ధతి ని గోన బుద్ధారెడ్డి ప్రభృతు లనుకరించిరి. దీని వలన వైష్ణవ మత ప్రచారము, అవతార పురుషుడైన రాముని దివ్యత్వ ప్రతిపాదనము జరుగుటయే గాక, సనాతన ధర్మ ప్రతిపాదక కథానకములపై ప్రజల దృష్టి పడినది. అనగా వేరు వేరుగా శైవ వైష్ణవ మతోద్యమములు సాగి వచ్చినను, వీనిలోని అవైదికాంశములు వెనుకబడి వైదికాంశముల కాకరము లభించినది. కాకతీయ నృపులలో ఆంధ్రదేశము నంతటి నేకచ్ఛత్రాధిపత్యము కిందకు తేవలెనని యత్నించిన గణపతిదేవుని పరిపాలనా కాలమున అల్లకల్లోలము లణగిపోయి, ప్రజల సాముదాయిక చైతన్యము గంభీర సాహిత్యసృష్టి నాకాంక్షించు స్థితి కెదిగినది. దీని నుపయోగించుకొని ఆర్షమత వ్యాప్తికి పూనుకొనిన మహా మనీషి తిక్కన. నిర్వచనోత్తర రామాయణ రచనా కాలము నాటికి శైవుడై యుండిన తిక్కన, భారతమున హరిహరాద్వైత ప్రవక్తయైనాడు. అప్పటి దేశ పరిస్థితికి పలనాటి చరిత్ర దర్పణము వంటిది కావచ్చును. తిక్కన కాకతీయ గణపతి ఆస్థానమున కేగి నెల్లూరి పరిపాలకుడగు మనుమసిద్ధికి రాజకీయానుకూల్యమును సంపాదించుటయే గాక, జైన మతస్థుల ను వాదములో నోడించిన వృత్తాంతము ప్రసిద్ధము.

పద్మనాయకులు, రెడ్లు సనాతన ధర్మ సంరక్షకులైరి. అద్దంకి రాజధానిగ నేలిన ప్రోలయ వేమారెడ్డి ఆస్థాన కవి యగు ఎర్రాప్రగడ భారతారణ్య పర్వ శేషము, హరివంశము ఈ యనుశీలనమున మిక్కిలి ప్రధానమైనవి. మొదటి గ్రంథమున కథా వకాశము మేరకు స్వామి పరతత్త్వ లౌకికత్వములు నిరూపితములు. హరివంశములో స్వామి సమగ్రకథ ఆవిష్కృతమైనది. జననము మొదలు స్వామి సమగ్రకథ యిందున్నను, భారతమునకు ఖిల పురాణ మగుట వలన కౌరవులను పాండవులతోడి సంబంధము వివరములు, అవతార సమాప్తి అను నంశము లిందు లేవు.) నన్నయ, తిక్కనల వలెనే ఎఱ్ఱన సమగ్ర కవిత్వ శిల్ప శక్తిగల సంయమనశీలి. కృష్ణకథా నిర్వహణమున ఈ లక్షణముల వ్యక్తి మొనర్చినాడు. ఎర్రన హరి వంశరచనతో సమగ్ర కృష్ణకథావతరణమున ద్వితీయ ఘట్టము పూర్తియైనది.

కృష్ణకథా వికాసమున తొలి మలుపు నాచన సోమనాథుని ఉత్తర హరివంశము. సోమన బుక్కరాయల సమకాలీనుడైన విజయ నగర కవి ఈతని ఉత్తర హరివంశ రచనములో ఆంధ్ర వాఙ్మయ మున నేక దేశ కృష్ణకథా ఘట్టములను ప్రపంచించి రచించు సంప్ర దాయ మారంభమైనది. భామావ్యాకాశములు పట్టని ఔజ్జ్వల్యము, అలంకృత కవితారీతి, నవీనగుణ విభూతి స్వామి కథాంశముల కలంకార ములై పరమాద్భుత చమత్కృతులతో, క్రొత్త మెరుగులతో స్వామి కథ బాహిరిల్లినది. అయినను నాచన సోమన తిక్కనను తన వాఙ్మయా దర్శముగ నిలుపుకొనిన వాడు కావున సంప్రదాయపు చట్రమును, తత్త్వ ప్రతిపాదనాభి రతిని సడలించినవాడు కాలేదు.

భారతీయ సంస్కృతికి మూలశక్తు లనదగిన భారత, రామా యణ, భాగవతములలో భారతము కవిత్రయము వారిచేత సమగ్ర శిల్పాకృతి నందినది. రామాయణమున తిక్కన నిర్వచనోత్తర రామా యణము, రంగనాథ రామాయణ ద్విపదాకృతి అవతరించినవి.

అటుపై భాస్కర రామాయణము పండిత రంజక రీతిలో వెలువడి తెనుగువారికి రామకథయందును, రాముని యందును గల వాక్కు వకు నిదర్శనమైనది. ఈ యుగమున నివియే చెప్పదగిన కావ్యములు. మొత్తముమీద కవిత్రయ యుగమున ఐతిహాసిక పౌరాణిక కావ్యశిల్ప గాంభీర్యముగల రచనములు వెలువడుట, వాని కుత్తేజ కారణముగ నేదే నొక మత సంప్రదాయ ముండుట గమనింప దగిన అంశములు. ఇది కవిత్రయ యుగ వృత్తాంతము (క్రీ. శ. 1030-1400).

## శ్రీ నా థ యు గ ము

పిమ్మట సాహిత్య చరిత్రకారులు ప్రబంధపూర్వ యుగము లేక శ్రీనాథయుగమని పిలిచిన కాలము పరిశీలనార్హము. ఈ యుగకర్తయైన శ్రీనాథుని రచనములతో ఈ యనుశీలనమునకు ప్రత్యక్ష సంబంధము లేదు. కాని శ్రీనాథుని సాహిత్యోత్తేజ విస్తృతులు, ఆంధ్రవాఙ్మయముపై వాని ప్రభావము గమనార్హములు. ప్రాచీన పురాణాదులనుండి కథలను గ్రహించి, ప్రపంచించి కావ్యములు వ్రాయుపద్ధతి శ్రీనాథుని చేతిలో పరిణతి నందినది. ఈతడు కొండవీడు, రాజమహేంద్రవరము, విజయనగరము మున్నగు ప్రాంతముల తన సాహిత్య పతాకము నెగురవేసి వివిధ సత్కృతుల నందిన మహాకవి. ఈతని అవతరణము వలన కవిత్వ పద్ధతులలోను, ధ్యేయములలోను మార్పులు వచ్చినవి. ప్రాచీన కథావస్తువులలోని పౌరాణికౌన్నత్యమును సగపాలు తగ్గించి, వర్ణనాది చమత్కారముల చేత, రసవద్రచనము చేత పూరించుట జరిగినది. ధర్మాభిరతిని కవులు పూర్తిగ విసర్జింప లేదుగాని ధర్మమునకు ప్రక్కనే విలాస ప్రవృత్తికి పీట వేసినారు. జనహృదయ తోషణార్థము దేశి కవితా స్వరూపములను చేబట్టినారు. లౌకికౌన్నత్యమును కాంక్షించుచో కర్పూర తాంబూలము మొదలు కనకాభిషేకము వరకు పొందఁగల్గిన లక్షణములకు శ్రీనాథుడు ప్రతినిధి. ఇవి తత్కాలమున ప్రధాన విషయములు కాకున్నను, పోనుపోను వాఙ్మయ పరిణామమున

సుదూర ప్రాధాన్యము నెరపిన అంశములు. రెడ్డిరాజులు, ఇతర రాజ్యపాలకులు, సాహిత్యపోషకులు ధర్మరక్షణశీలు రగుట, ఈ యుజ్జ్వల సాహిత్య సృష్టికి మూలకారణము. విలాసమునకు దూరము గాని ధర్మరతి, కవితాధ్యేయమును పూర్తిగ వదలివేయని స్వాతంత్ర్యము గమనింపఁదగిన యుగలక్షణములు. కాలమునుఁబట్టి యీ యుగమున చేరఁ దగినను, కవితా లక్షణాదర్శములనుఁబట్టి భిన్నుడైన మహాకవి పోతన. (క్రీ. శ. (1400–1450.) ఇతని భాగవతానువాదము అనన్య ప్రాధాన్యముగల ఘట్టము. ప్రప్రథమముగ స్వామి మాధుర్య లీలాంశములు, భక్తిగమ్య తత్త్వము ఆంధ్ర వాఙ్మయమున నవతరించి, పోతన రచనా మాధుర్య భక్తిపారవశ్యములచే భాగవత మాంధ్రదేశమున సర్వజన హృద్య పురాణమైనది. దీనితో ఆంధ్ర వాఙ్మయమున స్వామి కథాంశము లన్నియు నవతరించినట్లే. కృష్ణకథావతరణమున ఇది తృతీయ ఘట్టము. ఇటుపైనంతయు భారత, హరివంశ, భాగవతము లను మూలములపై వచ్చిన పెంపుసొంపులు. కాదా యెచ్చటనేని పూర్వోక్తములైన విశిష్ట పురాణముల అనువాదములు, అనుసరణములు. పోతన భాగవత రచనముతో మూల గ్రంథావతరణ మను ఘట్టము పూర్తియైనట్లే. మిగిలిన దొక్క విష్ణు పురాణము. అది ప్రస్తుతానుశీలన దృష్టితో ప్రాయికముగ హరివంశము వంటిదే. అర్వాచీన కాలమున తత్ప్రసక్తి వచ్చును. మొత్తము మీఁద ఈ యుగమున శైవ వైష్ణవ మత సంప్రదాయములకు చెందినట్టియు, పరస్పర ద్వేషపూరితములు కాపట్టియు రచనములు జరుగుట గమనార్హము[2]. నాటి రాజకీయ పరిస్థితు లందును, సామాజిక చైతన్యము నందును సమత్వదోహద భూతములైన పరిస్థితులు నెలకొనియున్నవి. సమకాలీన రచనా రీతులు, కావ్యధ్యేయము పోతన ప్రతిబింబింపకుండుట కాతని విశిష్టమైన ఆధ్యాత్మిక సంస్కారము, దార్శనిక స్థాయి కారణములు.

2. శ్రీనాథుని కావ్యములయం దీశ్వర పారమ్యము ప్రతిపాదింపఁ బడినను, వైష్ణవ వైరుధ్యము లేదు. పోతన కౌటుంబిక సంస్కారము, ఆధ్యాత్మిక సాధనా పరంపర శైవమునకు చెందినవి. కాని భాగవతమున నాతడు పరమ భాగవతుడు.

మడికి సింగన కృష్ణకథా వికాసమున మూలగ్రంథ కర్తగ భావింపఁ దగినవాఁడు. సరసము, సమరసము నైన శైలిలో నీతఁడు భాగవత దశమ స్కంధమును ద్విపదలో రచించెను. ఇతని కాలము పోతనకంటె పూర్వమని కొందరు భావించిరి.[3] అయినను గాకున్నను కథా విస్తృతి పరిగణనమునుఁ బట్టియు, పఠన పాఠనాది విషయములనుఁ బట్టియు, కార్యకర్తల తరతమ భేదములనుఁ బట్టియు ఈ యనుశీలనమున భాగవత సందర్భము లన్నియు పోతనోపజ్ఞము లే గృహీతములు. మడికి సింగన పద్మపురాణోత్తర ఖండము ననువదించి ఆంధ్రవాఙ్మయమున విశిష్ట పురాణానువాద సంప్రదాయమునకు నాంది పఠించినాఁడు. భారతమునకు పూరకమై చిత్రకథాకల్పనలతో నొప్పు జైమినీ భారతమును (అశ్వమేధ పర్వము) పిల్లలమర్రి పిన వీరభద్రుఁడు (క్రీ. శ. 1490) రచించెను. ఇదియు మౌలికమైన పరిగణనమునకే అర్హము. ఇందలి కథలు కొన్ని అర్వాచీనకాలమున బహు ప్రక్రియలలో వ్యాప్తినందినవి. తాళ్ళపాక అన్నమాచార్యుల (క్రీ. శ. 1424-1503) సంకీర్తనము లీ యుగమున గమనింపఁదగినవి. వీనిలో కథా నిర్వహణ పూర్వకమైన కృష్ణ ప్రసక్తి లేకపోయినను, ఇందలి శృంగారాధ్యాత్మిక భావసందర్భములలో ఈ అనుశీలనమునకు ప్రమేయము మున్నది. తాళ్ళపాక తిమ్మక్క సుభద్రాకళ్యాణము నరనారాయణ తత్త్వమునను నిదానము. మొత్తముమీద ఈ యుగమున కృష్ణకథకు సంబంధించి భక్తి ప్రధానమైన భాగవతావతరణము, శృంగారాధ్యాత్మిక భావస్ఫోరకములై, నూతనత్వము గల బహువిధ కావ్యసృష్టి గమనార్హములైన విషయములు. ఇది శ్రీనాథ యుగ వృత్తాంతము. (క్రీ. శ. 1400 -1500)

---

3. మడికి సింగన భాగవత దశమస్కంధము క్రీ. శ. 1420 కి పూర్వమే రచించె ననియు, ఇది పోతన భాగవతమున కన్న పూర్వరచన మనియు శ్రీ వాసిష్ఠ ఆ. మహాదేవశాస్త్రి అభిప్రాయము. (పుట iii-ఉపోద్ఘాతము, సరస్వతీమహాలు ప్రచురణము-1950)

## ప్రబంధయుగము

ప్రబంధ యుగమున సాహిత్యమునందు విశిష్ట లక్షణములు కొన్ని నెలకొనినవి. పూర్వయుగములందు వికాసోన్ముఖము లైన యీ లక్షణములు సమకాలీన జీవన పద్ధతులనుఁ బట్టియు, ప్రజల రాసిక్య సంపద్విశేషములను బట్టియు నొక విశిష్టాకృతిఁ దాల్చినవి. అందులకు చారిత్రికముగ కృష్ణరాయని రాజకీయ సాంస్కృతిక వైదుష్యము, కళాపోషణము ప్రధాన కారణములు. ఈ యుగమునందు రూపొందిన సాహిత్య ప్రక్రియను ప్రబంధ పదముచేత నిర్దేశించుటయు, అది పూర్వ యుగముల సాహిత్య లక్షణముల క్రమ పరిణామ ఫలితమై యుండుటయు ప్రసిద్ధ విషయములే. ప్రబంధ రచనామార్గ మొక్కటియే నాటి కవులందరు ననుసరించిరని కాని, సాహిత్య విమర్శకులు సౌకర్యార్థము నిర్దేశించిన లక్షణములు కలిగినదే ప్రబంధమని చెప్పుటగాని నిష్కర్షమైన విషయము కాదు. కాని వినూత్నముగ రూపొంది, తత్కాలముననే గాక అర్వాచీన యుగములందు సైతము తన ప్రభావము నెరపిన సాహిత్య ప్రక్రియయొక్క ప్రాధాన్య వివక్షయే యిందు గమనార్హము. ప్రబంధములందు కథావస్తువు పూర్తిగ సన్నగిల్లిపోయి చమత్కార పూరితము, సభారంజకము, అలంకృతము, రసైక ప్రధానమునైన రచనా పద్ధతి వ్యాపించినది. వీనిలో నంది తిమ్మన పారిజాతాప హరణము (క్రీ. శ. 1515) ప్రముఖమైనది. ఇది కృష్ణ కథా వికాసమున నొక ముఖ్యమైన ఘట్టము. ఇందు స్వామి ప్రబంధ నాయకుడై రూపొంది అర్వాచీన ప్రబంధ వాఙ్మయము నందలి సర్వ విధ పరిణామములకు కేంద్రమగుచు వచ్చినాడు. తరువాతి కాలమున పారిజాతాపహరణమువలె కృష్ణకథా కావ్యసృష్టి నుత్తేజ పరచిన గ్రంథము లెన్నియో లేవు. ఈ యుగముననే కొంచె మిటు నటుగ వెన్నెలకంటి సూరన విష్ణుపురాణాంధ్రీకరణము, నన్నయాదుల ఆంధ్రీకరణ మార్గముననే జరిగినది. కృష్ణకథా మూల కావ్యములలో

దీనికొక స్థాన మున్నది. (ఇందలి కథా సంవిధానాదులు ప్రాయిక ముగ హరివంశ ప్రణాళికనే అనుసరించుట వలనను, సూరన కావ్యము నుండి అర్వాచీన కవులచే నుద్ధృతమై కొనసాగింప బడిన ప్రధాన కథా ఘట్టములు భాగవత హరివంశేతరము లెక్కువగ లేకుండుట వలనను, ప్రస్తుతాను శీలనమున దీనికొక అవసరమైన స్థానమే లభించుచున్నది. విభిన్న కృష్ణ కథాంశముల ప్రతిపదికాను శీలన ఘట్టములలో నేదేని విశిష్టతను చూపవలసివు డీ గ్రంథము ప్రసక్తమగును.)

ఈ యుగమున నిద్దరు విశిష్ట కవులను గూర్చి చెప్పవలసి యున్నది. అందు మొదటివాడు చింతలపూడి ఎల్లన. రాయల సమకాలీనుడై ఆతనిచే రాధా మాధవ కవియని పురస్కారము నందినవాడు. రాధాకృష్ణ కథా ప్రబంధ రచనమున కాద్యుడు. కాని రాధా కథా సృష్టి విషయమున ఆంధ్రవాఙ్మయమున నేటికిని నిలిచియున్న ఒక సందిగ్ధ స్థితి కీతడు ప్రతినిధి. అది యిట్లు: ఆంధ్ర వాఙ్మయమున రాధాకృష్ణ కథ పెంపొందినది కొలది. అది రెండు మార్గ ములనున్నది. మొదటిది బ్రహ్మవైవర్తాదు లందున్న సాంప్రదాయిక మార్గము. రెండవది కృష్ణునితో వివిధ బంధుత్వములు గలిగి శృంగా రైక స్వరూపిణియైన రాధా చరిత్రము. తన కాలము నాటికి వ్యాప్తిలోనున్న వివిధములైన కట్టుకథలు ప్రతిపదికగ అర్వాచీన కవు లనేకులు రాధాకృష్ణ శృంగార సముద్రమును మధించి యందు మొదట పుట్టిన వస్తువును దేశమున వెదజల్లినారు. సాంప్రదాయిక నిష్కర్షతో పవిత్ర భావముతో నే కొందరో రచన మొనర్చిరి. చింతలపూడి ఎల్లనకు నూతన కథాకల్పనా వైశిష్ట్యముతోబాటు భాగవత సంప్రదాయాను సరణమువలన కలుగు సౌలభ్య ప్రసిద్ధులు ధ్యేయములై, తన రాధామాధవ కల్యాణమును రుక్మిణీ కల్యాణ మార్గమున మలచినాడు. బ్రహ్మవైవర్తాదులు తెనుగు వాఙ్మయ మున ఘంటా పథములు కాకుండుటయు నిందులకు కారణము. ఈతడు రచించిన విష్ణుమాయా నాటకమున చక్కని కాల్పనిక కళ

యున్నది. ఇట్లీతడు రెండు విభిన్న మార్గములకు (రాధాకృష్ణ కథా ప్రబంధ రచనము, కాల్పనిక కథా నిర్మాణము) కర్త యైనాడు. రెండవవాడు దుర్నిరీక్ష్య సాహిత్యమూర్తి రామకృష్ణుడు. శైవ శాక్తేయ వైష్ణ వాగమ జ్ఞేయమైన పాండురంగ సంప్రదాయము నాంధ్ర భాషయం దవతరింపఁజేసి కృష్ణతత్త్వమునందలి వివిధాంశము లతోబాటు రాధాతత్త్వమును మహత్తరముగ దర్శించి యొక నూతన సంప్రదాయమునకు కర్త యైనాడు. కాని యీ సంప్ర దాయమును తరువాతి కవులెవ్వరును నిలుపఁజాలక పోయిరి. సాహిత్య రంగమున అప్పటికే నెలకొనుచున్న గతానుగతిక రచనా విధాన ములకు, భావదాస్యమునకు, పతనోన్ముఖత్వమునకు ఇది నిదర్శనము. పిమ్మట కల్పనాగతమైన కృష్ణ చమత్కారమునకు పింగళి సూరన కళాపూర్ణోదయము, నిర్వహణ దక్షతకు ప్రభావతీ ప్రద్యుమ్నము నెన్నఁదగినవి.

తాళ్ళపాక వారి సాహిత్యమున ప్రత్యక్ష పరోక్ష మార్గ ములలో కృష్ణకథావృత్తు లున్నవి. రాయల వారికి సమకాలీనుడైన పెద తిరుమలాచార్యుని సంకీర్తనములలోను, వెంకటేశ్వర వచనముల లోను పరోక్షముగ కృష్ణ తత్త్వాంశములు కలవు. తాళ్ళపాక చిన్నన్న అష్టమహిషీ కళ్యాణము అర్వాచీన సాహిత్య సృష్టికి దోహద మొస గిన ఉత్తమ ద్విపద కావ్యము. స్వామి కల్యాణముల నొకచో భాగ వతానుసార మీ త డు నిబంధించినాడు. అప్పటి నుండి యిప్పటి వరకు స్వామి కల్యాణముల నన్నిటినో కొన్నిటినో కథావస్తువుగ నిబంధించి కావ్యనాటకముల రచించు సంప్రదాయము కలదు. ఇట్లీ తడు సుదూర వ్యాప్తమైన ఒక కథాగ్రథన పద్ధతికి మార్గదర్శకు డైనాడు. ఈతని ఉషా పరిణయము గూడ నొక మార్గదర్శక కావ్య మనియే చెప్పవలెను.

వెలగపూడి వెంగయామాత్యుడు శ్రీకృష్ణ కర్ణామృతమును మనోహరముగ, మూలానుసారముగ ననువదించెను. అనువాదము

లతో నిమిత్తము లేకయే సర్వ జనాకర్షములై కృష్ణకథా సాహిత్య మున ప్రముఖములై, వివిధ భాషాకవులపై తమ ప్రత్యక్ష పరోక్ష ప్రభావమును నెరపిన రచనములలో నిది యొకటి. లోక మోహన శిశువుగ, క్రీడా ముగ్ధమూర్తిగ, శృంగార రస ప్రతీకగ, మంత్రి ధ్యేయాకృతిగ, పరబ్రహ్మముగ స్వామితత్త్వ మిందు లోకోత్తరము. అట్లే జయదేవుని గీతగోవిందము రాధాకృష్ణ శృంగారమునకు శిఖ రాగ్రప్రాయము. దీని కనేకానువాదములు ప్రసిద్ధాప్రసిద్ధములు కలవు. జయదేవుని రచనాముద్ర వ్యక్తావ్యక్త రూపమున నెంద రాంధ్రకవుల వ్యక్తిత్వమునో ఆకట్టుకొన్నది. అట్టిదే మరియొక మహత్తర సృష్టి నారాయణ తీర్థుల కృష్ణలీలా తరంగిణి. ఈ రెండు గ్రంథములకును తెనుగునాట సంకీర్తనా పరమైన వినియోగ మధి కముగ నుండుటచేతను, ఇవి సంస్కృత భాష యందుండుట చేతను, ప్రస్తుతాను శీలనమున సాక్షాత్ప్రసక్తములు కాలేదుగాని, వీని పరోక్ష ప్రభావము కాదన జాలము. నారాయణ తీర్థులు రచించిన పారిజాతాపహరణ యక్షగానమున (లభించినంతవరకు) విశేషములు లేవు. కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకము స్వామి మనోహర శృంగారమును ప్రతిపాదించిన రసభద్రచన. అర్వాచీనాష్టకముల సృష్టి కిది మార్గదర్శకము. చరిగొండ ధర్మన చిత్ర భారతము కావ్య నిక కథా సాహిత్యము నుత్తేజ పరచినది. ప్రబంధ యుగము నందీ విధముగ కృష్ణకథా ప్రస్థానము సాగి వచ్చినది. ఈ యుగ లక్షణము లలో మున్నుగ నిర్దేశింపదగినవి-నూతన భావోజ్జ్వల్యము, రసప్రాధా న్యముగల సాహిత్య దృక్పథము. అంత మాత్రమున నవ్య సంప్ర దాయములు నెలకొనలేదని చెప్పఁజాలము. ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము, శ్రీకాళహస్తి మహాత్మ్యము వంటి దార్శ నిక రచనములు, వివిధ సంకీర్తనముల భక్తిసాహితి ఈ యుగము నందే ప్రభవించినవి. మొత్తముమీద కృష్ణ కథాపరమైన పరి ణామము శృంగారముదెస పూర్తిగ మొల్లు సూపినది. ప్రక్రియా

పరముగ ప్రబంధమునకు ప్రముఖ స్థానము లభించుట, మతపరముగ వైష్ణవ మాధిక్యము వహించినను పరమత సహనాది సద్గుణము లుండుట గమనార్హము. ఇది ప్రబంధయుగ వృత్తాంతము (క్రీ॥ శ॥ 1500–1619).

## దక్షిణాంధ్ర యుగము

అటుపై పరిశీలింప దగినది దక్షిణాంధ్రయుగము. (క్రీ॥ శ॥ 1620–1775) ఈ యుగము ప్రాయికముగ ప్రబంధ యుగము వంటిదే యైనను విజయనగర చక్రవర్తుల అనంతర కాలమున ఆంధ్ర దేశమునను, తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు మున్నగు ప్రాంతములందును వర్ధిల్లిన సాహిత్య చరిత్రానుశీలనమునకీ పదమును చరిత్రకారు లుద్దేశింతురు. ఈ యుగమునకు చారిత్రక భిత్తికగ కొన్ని యంశముల నిర్దేశింప వచ్చును. అందు ముఖ్యమైనది సాహిత్యాది కళాపోషణమునకనువైన వాతావరణము పై రాజ్యములలో నెలకొనిన దైనము, నిరంతరము మహమ్మదీయులతో పోరాడ వలసి వచ్చిన విజయనగర రాజులకు విస్తృతమైన సైన్యము, ధనము కావలసి వచ్చినవి. అందులకై కృష్ణదేవరాయ లొక యేర్పాటు చేసెను. దేవదేయ, బ్రహ్మదేయములు గాక మిగిలిన గ్రామముల నన్నిటి నాతడు భండార వాడ గ్రామములు, అమర గ్రామములు నను రెండు రీతుల విభజించెను. రాజు కొన్ని నిబంధనముల ననుసరించి దళనాయకుల కొసంగు గ్రామములకు అమర గ్రామము లని పేరు. యుద్ధము వచ్చినపుడు గజాశ్వ బలములతో వచ్చి పోరుట, సాంవత్సరికముగ కప్పము చెల్లించుట అనునవి యమర పద్ధతి యందు ముఖ్య నిబంధనములు. రాయల యనంతరమును, తల్లికోట యుద్ధానంతరమును సంభవించిన అరాజక పరిస్థితుల నాధారముగఁ గైకొని యమర నాయకులు పరిసర ప్రాంతములం దమర రాజ్యము లాక్రమించుకొని నూతన సంస్థానముల స్థాపించిరి. అట్టివానిలో మధుర, తంజావూరు, జింజి రాజ్యములు ముఖ్యమైనవి. ఈ రాజ్యములు

దక్షిణమున నుండుటచే శత్రు భయమునకు దూరములై యుండెను. సారవంతములైన రాష్ట్రముల నుండి వచ్చు ఆయమును యథేచ్ఛముగ ననుభవించుచు సంగీత సాహిత్యములతో కాలక్షేపము చేయుటకు వారి కవకాశము లభించినది. దీనికి తోడు మహమ్మదీయ దండయాత్రలకు నెలవై విజయనగర సామ్రాజ్యము నందలి కవిగాయక నర్తకాదులు దక్షిణమునకు పోయి రసికులైన నాయకరాజుల నాశ్రయించిరి. ఇట్లు దక్షిణ దేశమున వాఙ్మయాభివృద్ధికి తగిన యవకాశములు లభించినవి. పరస్పర పోషకములైన యీ లక్షణముల వలన సృష్టిలోనికి వచ్చిన వాఙ్మయమున కొన్ని విశేషము లున్నవి. అందు మొదట పేర్కొనదగినది రచనా ప్రక్రియల వైవిధ్యము. వస్తుస్వీకృతి, రచనా ధ్యేయము, కవుల స్థాయి యను విషయములలో ప్రాయికముగ ప్రబంధయుగ ధోరణులే వ్యక్తమైన వని చెప్పవచ్చును. యక్షగాన వచనాది కృతుల ప్రాబల్యము, ప్రబంధ యుగమున కంటె నొక మెట్టు క్రిందికి దిగిన అభిరుచి, విశృంఖలమైన రాసిక్యము గమనార్హములు. కృష్ణకథా దృష్టితో పరిశీలించినపుడీ యుగమున మౌలిక సృష్టి తక్కువ. అది ప్రబంధ యుగమునను తక్కువే. కొన్ని మెరుగులు మాత్రము నాడు పొడసూపినవి. ఈ పద్ధతియే మరింత విస్తృతి నంది సభారంజకత్వము, వినియోగము అను లక్షణములు ధ్యేయములుగ వాఙ్మయసృష్టి కొనసాగినది. రాజాస్థానములు మొదలు రచ్చబండల వరకు వెల్లివిరిసిన కళా ప్రదర్శనోత్సుక్యమునకు తగినట్లు యక్షగానాదుల రూపు నందినవి. తల్లక్షణములు మార్గ సాహిత్యమున కూడ చోటు చేసికొనినవి. కొలది చమత్కారములతోను, మరి కొలది కల్పనా విశేషములతోను రచన మొనర్చి ప్రభువులను ప్రజలను మెప్పించుట కవుల కాదర్శమైనది. కృష్ణ సంబంధి వాఙ్మయమునం గూడ ఈ లక్షణములే ప్రతిబింబించుచున్నవి. మాధుర్యము, ప్రక్రియా వైవిధ్యము ప్రాతిపదికలుగ ఈ యుగపు సాముదాయిక చైతన్యము మొత్తముమీద పతనోన్ముఖమైనది. రాసిక్యము, సౌల

భ్యము, దీప్తి, కళావినియోగ ధర్మములు పైకి వచ్చి ధర్మనిష్ఠ, భావ గాంభీర్యము లుప్తములైనవి. కథలు ప్రాచీనములైనను భావములు సమకాలీనములే. ఇట్టి పరిస్థితులు ప్రాతిపదికలుగ విస్తరిల్లిన కృష్ణ కథావ్యాప్తి నీ క్రిందివిధముగ నిర్దేశింపనగును.

తంజావూరునకు సంబంధించి మున్నుగ చెప్పదగినది, రఘునాథ నాయకుని కాలము. నాయకుడు స్వయముగ కవి, కవిపోషకుడు, ఉత్తమ పరిపాలకుడును. అతని ఆస్థాన కవియైన చేమకూర వేంకట కవి విజయ విలాసమున నరనారాయణ సంబంధము, స్వామి నిర్వహణ దక్షత, సరస చమత్కారాంశములు ప్రసక్తములైనవి. కృష్ణాధ్వరి నైషధ పారిజాతము ద్వ్యర్థి కావ్యము.[4] చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసము విచిత్ర సృష్టి. స్వామి యష్ట మహిషులను అష్టవిధనాయికలుగ, ఆయన శృంగార విభూతి యిందలి ప్రధానాంశము. అష్టమహిషీ కళ్యాణ ప్రసంగములు కేవల కథా పరములుగనే గాక భిన్న భావాశ్రయములుగ రూపొందించెడు పద్ధతి బహుశః మొదటి సారిగ ఈతని రచనముననే వ్యక్తమగు చున్నది.

విజయరాఘవుని పరిపాలనా కాలము సాహిత్య చరిత్ర యందొక మధురస్వప్నము వంటిది. కావ్య రచనమునందా వరకే నెలకొనిన సౌకుమార్యాద్యంశములు పరస్థితి నందినవి. అతని యాస్థానము కవి పండితులకే గాక కవయిత్రులకు, నట్టువ రాండ్రకు విహార రంగమై విలాస భూమియై వర్ధిల్లినది. దేశమును అట్టి స్థితిలోనే యుండినది. యక్షగాన ప్రదర్శనము లానాటి సంస్కృతిలో భాగములు. నాయకుడు రచించిన పూతనాహరణ, కాళీయ మర్దనాది యక్షగానములందు ప్రత్యేక శిల్పము, తత్త్వోద్దీప్తి మున్నగు నంశములు మృగ్యములైనను, సుకుమార మధురములై యాతని

4. ద్వ్యర్థికావ్యములు పాండితీ మండనములు. వాని యందలి కథాశిల్ప రసపోషణాదులు సాధారణ కావ్యములవలె క్రమానుశీలన దృష్టితో వివేచించుటకు యోగ్యములు కావు.

ప్రవృత్తిని, నాటి సాహిత్యము నందలి సామాన్యపరిస్థితిని నిరూపించు చున్నవి. రంగాజమ్మ ఉషాపరిణయము నట్టిదే. ఈ యుగమున పద కర్తలలో క్షేత్రయ్య ముఖ్యుడు. ఆతని మువ్వ గోపాల పదములలో స్వామి సానివాడల పోడుములను నేర్చుకొనవలసి వచ్చినది. తత్త్వ, శృంగారముల మధ్య నొక సంధి రేఖను గీచి అందు స్వామిని నిలిపిన క్షేత్రయ్య భక్తుడా, కేవల రక్తుడా అన్నది సాహిత్యలోకమున భిన్న దృక్పథములకు తావొసంగిన యంశము.

తంజావూరు తరువాత మధుర, పుదుక్కోట చెప్పదగిన సాహిత్య రంగములు. మధుర నాయకుడైన ముద్దళగిరి కంకితమైన లింగనమఖి కామేశ్వరకవి కృత సత్యాభామా సాంత్వనము తరువాతి కాలమున వెలునడిన సాంత్వన కావ్యముల కొరవడి. ఈ కోవకు చెందినవే విజయరంగ చొక్కనాథుని యాస్థానమునకు చెందిన సముఖము వెంకటకృష్ణప్పనాయకుని యొక్కయు, ముద్దుపళని యొక్కయు రాధికా సాంత్వనములు. అసభ్య శృంగార ప్రసక్తి యటుంచి, రచన యందు సైతము ప్రత్యేకించి చెప్పదగిన యంశములు లేనివి. గతానుగతికములు, సర్వసాధారణములు నైన విషయములను మధుర రచనారీతులలో వ్యక్తీకరించుట యన్నదే సాహిత్య పారమ్యము కానేరదు కదా !

విజయరంగ చొక్కనాథుని యాస్థానమున నున్న కథాశుకవి కుందుర్తి వేంకటాచలపతి మిత్రవిందాపరిణయ మను ప్రబంధమును, భారత, భాగవత వచనకావ్యములను రచించెను. అష్టమహిషీ కల్యాణేతి వృత్త ప్రబంధీకరణమునకు, గద్యవాఙ్మయ విస్తృతికి నివి యుదాహరణములు.

మైసూరు రాజ్యమున దామెర్ల వెంగళనాయకుడు రచించిన బహుళాశ్వ చరిత్రము సాధారణ ప్రబంధములకు భిన్నమైనది. స్వామి బహుళాశ్వునిపై చూపిన దయ యందు ప్రధాన వస్తువైనను శృంగార స్పర్శ లేకపోలేదు. మధుర రాజుల దళవాయియైన అనంత

భూపాలుడు విష్ణుపురాణాది వచన గ్రంథములను రచించెను. కూచిమంచి తిమ్మకవి రుక్మిణీ పరిణయము ప్రబంధ మార్గమునే అనుసరించినది. నీలాసుందరీ పరిణయము అచ్చ తెనుగు రచనము. ఇతని తమ్ముడు జగ్గకవి ద్విపద రాధాకృష్ణ చరిత్రమును రచించెను. ఇట్టి మార్గమునే అనుసరించిన అనేక కావ్యములు దక్షిణాంధ్ర యుగమున వర్ధిల్లి శృంగార మయము, రాసిక్యమయము నైన నాటి యుగధర్మమును నిరూపించినవి.

## క్షీణ యుగము

పిమ్మట చారిత్రికముగ పరిశీలించినచో పాశ్చాత్యుల ఆక్రమణ ఫలితముగ ఆంధ్రులకు తంజావూరు, మధుర మొదలైన సామంత రాష్ట్రము లందలి పాలనాధికారము గూడ నశించి కావ్యకళాపోషణము చిన్న చిన్న సంస్థానాధీశులపైఁ బడినది. ఈ పరిస్థితుల ఫలితముగ అన్నిరంగములందు వలెనే సాహిత్యరంగమునగూడ వ్యక్తమైన క్షీణపరిస్థితినిఁ పురస్కరించుకొని క్రీ. శ. 1775 నుండి 1875 వరకు వ్యాపించిన వాఙ్మయయుగమును క్షీణయుగ మని సాహిత్య చరిత్రకారులు పిలిచిరి. గతానుగతిక రచనాపద్ధతి, అభిరుచి దైన్యము, క్షుద్ర కావ్యసృష్టి మున్నగు లక్షణములు సాముదాయికముగ నీ యుగమున నున్నను, బహు కావ్యసృష్టి, వానియందు సమకాలీన సమాజ పరిస్థితుల ప్రతిబింబించుట మున్నగు విశిష్ట లక్షణము లెడనెడఁ గలవు. బహు సంఖ్యాకములైన కావ్యములలో నే కొన్నియో ప్రస్తుతానుశీలనమున నిర్దేశార్హము లగుచున్నవి.

ఆంధ్రవాగ్గేయకారులలో అనన్యుడైన త్యాగరాజస్వామి మహాభక్తులై, రామతత్త్వము తమ జీవలక్షణమైనను, కృష్ణతత్త్వము నద్భుతముగ దర్శించి నౌకా చరిత్రమును రచించిరి. ఆంధ్రవాఙ్మయమున నిది అనన్య సృష్టి. కనుపర్తి అబ్బయామాత్యుడు పిల్లవసు చరిత్రమని చెప్పఁదగిన అనిరుద్ధ చరిత్రమును రచించెను. కంకంటి నరసింహ కవి విష్ణుమాయా విలాసము చక్కని ద్విపద. కథావస్తువు

చింతలపూడి ఎల్లనార్యునిదే. బొబ్బిలి సంస్థానమున ఆస్థాన కవి యగు మండపాక పార్వతీశ్వర కవి కృష్ణాభ్యుదయము గచ్ఛన్మార్గమున కృష్ణకథను ప్రౌఢరచనా పద్ధతిలో కథన మొనర్చినది. ఈ యుగ మున చెప్పికొనఁ దగిన యుత్తమకావ్యము వెంకటగిరి ఆస్థానమున వర్ధిల్లిన గోపీనాథము వేంకటపతి శ్రీకృష్ణ జన్మఖండము. బ్రహ్మ వైవర్తము నందలి శ్రీకృష్ణ జన్మ ఖండమున కిది ఆధికారిక ప్రాధానువాదము. ఆంధ్ర వాఙ్మయమున బ్రహ్మవైవర్తము కావ్యరచనా మార్గమున గాని, యనువాద రీతిలోగాని పొందదగినంత విస్తతిని పొందలేదని చెప్పినచో ఈ కావ్యమునకుఁ గల చారిత్రక, కథావిషయిక ప్రాధాన్యము స్పష్ట మగును. దీనికితోడు రసవద్రచనా సౌష్ఠవముగల ఉత్తమ గ్రంథ మిది. తరిగొండ వెంగమాంబ విష్ణు పారిజాతము తాత్త్వికమైన యక్షగానము, మరింగంటి సింగరా చార్యుల శ్రీకృష్ణ శతానందీయము స్వల్పకల్పనా విశిష్టము.[5]

ఈ విధముగ క్షీణయుగము నందలి కృష్ణకథాకావ్య ప్రస్థా నము సాగివచ్చినది.

## నవ్య యుగము

నవ్య సాహిత్య యుగము స్థూలముగ క్రీ. శ. 1875 నుండి ప్రారంభమగును. ఇదియొక సంకీర్ణ ఘట్టము. ఇందనేకాంశములు, భావనాపద్ధతులు బహుముఖీనమైన సాహిత్య సృష్టికి కారణము లైనవి. పూర్వ యుగములం దెన్నడును లేని సాహిత్య చైతన్యము, బహుకావ్య రచనా ప్రచురణాదులు, విభిన్నములైన ఆదర్శ తత్త్వ ములు, ప్రక్రియా వైవిధ్యము మున్నగు ననేక లక్షణములు

5. "....కథ భాగవతమునుండి గ్రహింపఁబడినది. ఈ కవి కళాపూర్ణోదయమును చూచి కాబోలు ఇందొక విచిత్రమైన కల్పన కావించెను. కృష్ణుడు మాయా బ్రహ్మయై సరస్వతి కడ మండ సత్య బ్రహ్మ యట కరిగి అతనితో వాదించుట యీ కల్పన యందలి ముఖ్యాంశము...." (ఆంధ్రవాఙ్మయ చరిత్రము II-పుట 605, సంపుటము I- సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము. )

వ్యక్తములైనవి. ప్రస్తుతానుశీలనమున కవసరమైన కొన్ని యంశములు మాత్రమే యిందు గ్రహింపఁబడినవి. అంతకు మున్ను సాహిత్యము నందలి క్షీణ లక్షణముల నుండి వివిధ ప్రభావముల వలన నూతనోత్తేజము నంది అనేక మార్గముల విస్తరిల్లిన ఈ సాహిత్య యుగమున మున్నుగ నెన్నఁదగినది సంప్రదాయ కవిత్వ పద్ధతి. సాంప్రదాయిక వస్తు రచనా తత్త్వ ధ్యేయముల యందు గౌరవ ముంచుకొని యే కొలదియో కాలోచితములైన పరిణామములకు తలయొగ్గుచు కావ్యరచన మొనర్చిన వారనేకులు కలరు. అట్టి వారిలో తిరుపతి వేంకట కవుల నెన్నవచ్చును. (నవ్య సాహిత్యమున యుగకర్తల నిర్దేశించుట సాధ్యము కాని పని. కారణము బహు ప్రక్రియల, భావమార్గముల విస్తృతి. అట్లయ్యును భిన్న మార్గములకు ప్రధానులైన వారిని కొందరి నెన్నుటలో విప్రతిపత్తి లేదు. ప్రస్తుతానుశీలనమున ఈ దృక్పథమే యవలంబింపఁబడినది). వీరి సాహిత్యమున సంప్రదాయ ముద్రతోఁ బాటు సాహిత్యమును ప్రజాసామాన్యమునకు చేరువగ నొనర్చి వారి చైతన్యమునకు నూతనోత్తేజమును కల్పించిన సరసత్వ లక్షణ మున్నది. నిజమునకు వారి సాహిత్య సర్వస్వమున కిదియే ప్రాణ పదము. ఇతర కావ్యములటుంచి యీ సమీక్షలో ప్రసక్తమైన లక్షణా పరిణయ ప్రబంధము గతానుగతికమై, కతిపయోక్తి విశేషములతో నిండినది. కృష్ణకథా కావ్యములను కథా నిర్వాహణాది సమస్త లక్షణములతో రచించిన కవు లీ యుగమున లెక్కకు మిక్కిలిగ నున్నారు. వీరిలో కొందరు నేటికిని సంప్రదాయములోని బాహ్య లక్షణములనే యాదరించుచు నంతశ్చేతనమును ముట్టజాలని సాధారణ కవులు. మరి కొందరు సంప్రదాయము నందలి లోతులను తెలిసి వానిని సముచిత కావ్య రచనా శిల్పము చేత తీర్చి దిద్దినవారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి ప్రద్యుమ్నోపాఖ్యానము కండపట్టుగల సత్కావ్యము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రద్యుమ్నోదయము నట్టిదే. రామకథకు నవీన యుగమున తన అసదృశ కవితా శిల్పముచే ప్రాణ

ప్రతిష్ఠ నొనర్చిన ఈ మహాకవి కృష్ణకథా తత్త్వము నందలి బహు రహస్యములను భిన్న భిన్న కావ్యములలో ప్రదర్శించుట గమనార్హము. శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరుల కాళిందీ పరిణయము పరమ తాత్త్వికమైన కావ్యము. తాత్త్వికతకు, మార్మికతకు నవ్యాన్వయమును (వంగ సాహిత్య ప్రభావము వలననే కానిండు) సంతరించిన శ్రీ వేంకట పార్వతీశ్వరుల ఏకాంత సేవ సాక్షాత్కృష్ణకథా కావ్యము కాకపోయినను, నవ్య సాహిత్య తాత్త్విక ప్రగతిలో నొక ముఖ్య ఘట్టము. వీరి బృందావనమును మహత్తర సృష్టియే. శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల రాసలీల యొక మహా దార్శనిక కావ్యము.

ఈ యుగమున మరి యొక పరిణామము రాధాకృష్ణ తత్త్వమౌలికతను, సాంప్రదాయిక గాంభీర్యముతో, పవిత్ర దృక్పథముతో నవ్య సమన్వయ రీతుల దర్శించి ప్రదర్శించు కతిపయ కావ్యములు వెలువడుట. ఈ దృష్టిలో గోపీకథా కౌముది, విరజోపాఖ్యానము మున్నగు కావ్యము లెన్నఁ దగినవి. ఈ మార్గము కొంత వరకు సాగి వచ్చినది. కాని ఇందలి మేలి రకము కవిత యంతయు ఖండకావ్యము లందున్నది.[6]

6. పూర్వయుగముల వలెనే యథా మూలానువాద పద్ధతి, కల్పనాత్మక కావ్య రచనము, వచన వాఙ్మయసృష్టి యీ యుగమున సాగి వచ్చుచున్నది. శ్రీ జనమంచి శేషాద్రి శర్మ- బ్రహ్మ, బ్రహ్మాండ పురాణముల అనువాదము, తాండవకృష్ణ భాగవతము, కృష్ణావతార తత్త్వమను పేర నొనర్చిన వచన కృష్ణ కథా కథనము (ఇందు బ్రహ్మ వైవర్తాదుల కెక్కువ ప్రాధాన్యము) ఇట్టివి. శ్రీపాద వారి భారత భాగవతానువాదములు, తిరుపతి వేంకటకవుల దేవీ భాగవతానువాదము, పిశుపాటివారి పద్మ పురాణానువాదము, చివుకుల వారి గర్గ భాగవతాను వాదము, పల్లె పూర్ణప్రజ్ఞాచార్యుల రుక్మిణీశ విజయానువాదము నిట్టివే. కృష్ణాతి మానుష తత్త్వమను దివి రంగాచార్యుల కావ్యము కతిపయ కల్పనలతో నిండిన సంపూర్ణ కృష్ణకథ. ఇట్టివే కల్పనా విశిష్టములు కాకపోయినను అనేకములు కలవు.

నవ్య సాహిత్యమున ఖండ కావ్యము మిక్కిలి ప్రతిష్ఠ నార్జించుకొనిన ప్రక్రియ. అనతి విస్తృతిలో రసోదయమును సాధించుట దీని స్థూల లక్షణము. కథను ద్విజాతీయముగ పురాణాదుల నుండి గ్రహించుట, ఆత్మీయ భావ సంచలనమున కాకృతి కల్పించుట, హృదయ నివేదనము మున్నగు పెక్కు రీతు లిందుఁ గలవు. ఆంగ్ల కవిత్వ ప్రభావము, స్వాతంత్ర్యేచ్ఛ, దేశభక్తి, రాష్ట్రభక్తి మున్నగు భావ సంస్కారములు, అమలినమై భావ ప్రధానమైన శృంగార దర్శనము, విభిన్న తాత్త్విక విషయములు ఖండ కావ్యము లందలి భావ వైశిష్ట్యమునకు నిదర్శనములు. విశ్వనాథ వారి శృంగారవీథి, కృష్ణ సంగీతము, ప్రాతస్స్తవము మున్నగు ఖండికలు సాంప్రదాయిక మార్గమునకు, నూతన భావ చేతనకు నిదర్శనములు. శ్రీ గురజాడ రాఘవశర్మ కల్పలత వంటివి ప్రాచీన కథా వస్తువుల నించుక క్రొత్తదైన చూపుతో దర్శించిన ఖండికలు. కాగా నవ్య సాహిత్యమున ప్రముఖ కవులుగ నెన్న దగిన శ్రీయుతులు కృష్ణశాస్త్రి, చామర్తి, వేదుల, నాయని, కరుణశ్రీ మున్నగు వారి ఖండ కృతులలో కృష్ణ కథాంశములు నూతనౌజ్జ్వల్యము నార్జించుకొనినవి.

నవ్యయుగమున ప్రముఖ సాహిత్య విభాగము నాటకము. ఇందు సంస్కృత నాటక వాఙ్మయము నుండి క్రమ వికాసము ఆంగ్లాది సాహిత్య ప్రభావములు ప్రక్రియా పరముగ గమనింపఁ దగిన యంశములు. సంప్రదాయమును కొనసాగించినవారు, అనువాదముల నొనర్చినవారు, నూత్న కల్పనముల నాదరించిన వారు, వర్తమాన యుగపు సిద్ధాంతముల కృష్ణకథ యందెట్లో చొప్పించిన వారు, భిన్న ప్రేక్షక వర్గములకు సంతృప్తి నొసగు నాటకీయ వినియోగ పద్ధతులను తెలియొగ్గి కిరాయి రచయితలుగ పనిచేసినవారు– ఇట్లెందరో ఈ ప్రక్రియను చేఁబట్టిరి. కొండ వెంకట రత్నము గారి నరకాసుర వ్యాయోగానువాదము వంటి వనువాద శాఖకు

చెందినవి. తిరుపతి వేంకటకవుల భారత నాటకములీ యనుశీలనమున మిక్కిలి ప్రధానమైనవి. 'భారతకృష్ణుని' లౌకిక మహాత్త్వ, వ్యవహారదక్షత, ఆశ్రిత రక్షణా ద్యనేకాంశములు తిక్కనోపజ్ఞములైనవి, వీరి లేఖినిలో ఇతోధిక సరసత్వ లక్షణమును సంతరించుకొని తెనుగునాట స్థిరపడిపోయినవి. ఒక స్థాయికి చెందిన తెనుగువారికి కృష్ణుడన్న కురుక్షేత్రము కృష్ణుడే తలపునకు వచ్చునంతటి మహాత్త్వము వీరి నాటకమున కబ్బినది. ఈ విషయమున పోతన భాగవత కృష్ణునికే యాతడు రెండవవాడు. ఇంచుమించు అంతటివాడు చిలకమర్తివారి గయోపాఖ్యాన కృష్ణుడు, అటుపై పానుగంటివారి రాధాకృష్ణుడు, ముత్తరాజువారి సత్యాకృష్ణుడు చెప్పదగినవారు. వేదము వారి ఉషా పరిణయ నాటకము, పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి బాల, ప్రౌఢ కృష్ణలీలలు, బలిజేపల్లి వారి సాత్రాజితీయము, శ్రీ జాషువా రుక్మిణీ కల్యాణము ఎన్నదగిన కృష్ణ కథా నాటకములు. ఇక కల్పనలలో అందెవేసిన చేతులు, కాల్చుకొనిన చేతులు కొన్ని కలవు. శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము రుక్మిణీ పరిణయమున నొక బ్రాహ్మణి వృత్తాంతము చక్కని కల్పన. త్రిపురనేని వారి కురుక్షేత్రము వారి కతిపయ సిద్ధాంతములకు రూపకల్పన. కాళ్ళకూరివారి పద్మవ్యూహము కృష్ణావతారమున కొత్తవ్యూహము. డా॥ జి. వి. కృష్ణారావు యాదవ ప్రళయము స్వీయతాత్త్వికాలోచనా వలయము. నోరివారి సుహృత్సౌదామము మున్నగునవి యేకదేశ కథా ఘట్టముల రమ్య పునరావృత్తులు, కథాంతస్సును ముట్టినవి.

నవీన యుగమున వచన వాఙ్మయము నవల, కథానిక, వ్యాసము మున్నగు శాఖలలో వృద్ధి సందినది. అందే కొలదియో కృష్ణకథా వాఙ్మయము నవలాది రూపములందు వ్యక్తమగుచున్నవి. శ్రీ పిలకా గణపతిశాస్త్రి నాగమల్లిక, శ్రీ ముత్తీవి లక్ష్మణదాసు గోపీ హృదయానువాదము, లత మోహనవంశి మున్నగునవి కతి

ప్రయోగోదాహరణములు. డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య మందలి జాలము దివ్యజ్ఞాన దృక్పథమునకు చక్కని రూపకల్పనము.

ఇట్లింకను ననేక ప్రక్రియలలో విస్తృతినందిన నవ్య వాఙ్మయమున విశిష్టతా సంపన్నములైన కృష్ణకథాకృతులు బహుసంఖ్యాకములు. సాముదాయికముగ భావ చైతన్య విలసన మీ యుగ లక్షణము.

పై పరిశీలనమునుఁ బట్టి కృష్ణకథావతరణము మహోజ్జ్వలమై యుండిన దనియు, రాను రాను బహు ప్రక్రియలలో సమకాలీన సాహిత్య లక్షణములను సంతరించుకొని శృంగారైక ప్రాధాన్యము నందిన దనియు, నవ్యయుగమున మరల బహుభావ వైశిష్ట్యముతో కూడిన నూతనోత్తేజమును పొందుచున్నదనియు సాముదాయిక దిఙ్మాత్ర నిర్దేశము చేయవచ్చును.

# కృష్ణ కథాంశముల క్రమ పరిణామానుశీలనము

సర్వంకష వైభవోపేతము, సమగ్రము, సంకీర్ణమునైన కృష్ణ కథ యందలి వివిధాంశము లాంధ్ర వాఙ్మయమున కాలక్రమమున నెట్టి పరిణామములను నందుచు వచ్చినవో పరిశీలించుట ఈ యధ్యాయము నందలి విషయము. ఇందుల కనుగుణముగ కృష్ణకథ తద్గతమైన ఆంతరంగిక భావక్రమము ననుసరించి కొన్ని ప్రముఖాంశములుగ విభజింపఁ బడినది. అవతరణ వృత్తాంతము మొదలు తత్సమాప్తి పర్యంతము కల యంశము లన్నియు సాధ్యమైనంతవరకు క్రోడీకరింపఁ బడినవి. ఈ అంశములకు పరస్పర సాంకర్య భావమున్న చోట్ల వానిలోని ప్రధానాంశమే ప్రసక్తమైనది. మున్నుగ ఆ యా యంశముల స్వరూప దృక్పథములను స్థూలముగ నిర్దేశించిన పిమ్మట తదనుశీలనము సాగినది. ఆంధ్ర కవులలో ప్రస్తుత విషయమును బట్టి ప్రముఖులై తదితర కవులకు సైతము ప్రాతినిధ్యము వహింపఁగల వారి రచనముల నుండియే ప్రసక్తాంశము లుద్ధృతములై వ్యాఖ్యానింపఁ బడినవి. ఇట్లు వ్యాఖ్యానించుటలో ప్రసక్త కథాంశము నందలి ప్రత్యేకత, రచనా శిల్పములోను, తాత్త్విక ప్రతిపాదనములోను ఆ కవి ప్రత్యేకత మాత్రమే ప్రసక్తమై గతార్థములు పరిహృతములైనవి. సాధ్యమైనంతలో కవుల కాలక్రమము పాటింపఁ బడినది. ఒక్కొక్కప్పుడు కావ్యములు, కవులు వివిధాంశములందు వచ్చినపుడు ప్రసక్త కథాంశ జ్ఞేయమైన రచనా తత్త్వములనుఁ బట్టి బహుపర్యాయములు వారి ప్రసక్తి కలుగును. ఇందు ప్రముఖాంశముల ప్రణాళికయే ప్రధానము కావున ప్రక్రియా వైవిధ్యమునకు తావు లేదు' కావ్యములలో భిన్న కారణముల చేత ప్రత్యేకత నార్జించుకొనినవి, పరిశిష్ట కావ్యాను శీలనము నందును, ఈ పరిశీలనమున ఇముడని

ప్రక్రియాంతరములు పరిశిష్ట ప్రక్రియానుశీలనమునను నిర్దేశింపఁబడినవి. వీని సమాహార స్వరూపమే ప్రస్తుతాధ్యాయము.

## అవతరణ వ్యూహము

అవతరణ మనఁగ క్రిందకు దిగివచ్చుట. భారతీయ దృక్పథమున శాశ్వతము సర్వశక్తిమంతము నైన పరతత్త్వము లోక సంగ్రహార్థమై భిన్నయుగములలో పరిమితత్వ ప్రతీకమై నామరూపాది లక్షణ లక్షితమైన యాకృతిని పొంది, పై ప్రయోజనమును నెరవేర్చుట యీ యవతార తత్త్వ సారాంశము. అట్టి యవతారము సగుణమై నిర్గుణత్వమును, మానుషమై దివ్యత్వమును ఎప్పటికప్పుడు స్ఫురింపఁ జేయుచుండును. ఈ స్ఫురణమును విశ్వమానవ హృదయము లందు శాశ్వతముగ ననుసంధించుటకే పురాణేతిహాస కావ్య నాటకాది ప్రక్రియ లుద్దిష్టము లైనవి. ఈ యవతారము లందు శిఖరాగ్ర ప్రాయమైన కృష్ణావతార వ్యూహము, దానికి సంబంధించిన భిన్న దృక్పథములు, ఆంధ్ర వాఙ్మయమున భిన్నరీతుల నావిష్కరింపఁ బడెను. స్వామి విష్ణ్వంశ సంభూతి అన్నిట సామాన్యమే యైనను ప్రసక్తమాలిక పురాణేతిహాస దృక్పథాను సారముగ భిన్నకవు లీయంశమును భిన్నమార్గముల దర్శించి రచించినారు. వాని క్రమానుశీలన మీ క్రింది విధముగ నుండును :

ఆదికవి నన్నయ కథాప్రసక్తిని బట్టి గచ్ఛన్మార్గమున కృష్ణ కథాంశముల ప్రతిపాదించుచు నెడనెడ కృష్ణావతార సందర్భములలో చెప్పినాడు. ఆదిపర్వ తృతీయాశ్వాసమున దేవదైత్య దానవుల అంశావతార కథన సందర్భమున—

"యాదవ వంశంబున జగదాధిపుఁడగు విష్ణుదేవు నంశంబున ను
త్పాదిల్లెఁ గృష్ణుఁ డపగత ఖేదుఁడు దేవకీ వసుదేవులకున్."

(74)

"(శ్రీ) వెలుఁగ రోహిణికి వసుదేవున కుదయించె విష్ణుదేవాంశము నన్
భూవంద్యుఁ డనంతుఁడు బలదేవుండు ప్రలంబ ముఖ్య దితిజాంతకుఁడై." (75)

"మరియు లక్ష్మి యంశంబున రుక్మిణి యుదయించె; సనత్కుమారు నంశంబునఁ బ్రద్యుమ్నుండు పుట్టె; నప్సరసల యంశంబునఁ గృష్ణుని షోడశ సహస్రాంతఃపుర వనితలు పుట్టిరి, రయ్యయి వేల్పుల యంశంబుల వృష్ణి యదు భోజాంధక వంశంబుల వీరు లనేకులు పుట్టిరి......" (76)—అని చెప్పెను. సప్తమాశ్వాసమున నాలాయని కథలో "...కమల భవ ప్రముఖ నిఖిల సురగణ ప్రార్థితుండయి నారాయణు సితాసిత కేశద్వయంబు బల వాసుదేవులై దేవ హితార్థం బుద్భవించిన..." (277) అని చెప్పెను. అష్టమాశ్వాసమున "బలదేవాచ్యుత సాత్యకులు దైవమానుషంబుఁ గల నిత్య" లనియు చెప్పెను. పెక్కు సందర్భములలో కృష్ణార్జునులు నరనారాయణులను విషయ ముక్తమైనది. "......నరనారాయణులను నాదిమునులు నరలోకంబున దేవహితార్థం బర్జున వాసుదేవులై జన్మించి..." (8-250) రని చెప్పుట యిందుల కుదాహృతి. ఈ విధముగ భారత దృక్పథమునుఁ బట్టి స్వామి యవతారమున విష్ణ్వంశము, నారాయణుని అసిత కేశాంశము, ప్రాచీనర్షి యగు నారాయణాంశము నుద్దిష్టములైనవి. అరణ్యపర్వ శేషమున ఎఱ్ఱన రచనమున మార్కండేయోక్త ప్రకారమున స్వామి అవతార తత్త్వ మాహాత్మ్య ప్రసక్తి యున్నది. కల్పాంత వేళ క్షీర సాగరమున ప్లవించి సకల చరాచర విశ్వమును తన కుక్షియం దిడుకొన్న స్వామియే కృష్ణుడను విషయము గమ్యమాన మొనర్చుట యీ కథనము నందలి ప్రత్యేకత. స్వామి చెప్పిన యుగములను క్రోడీకరించి మార్కండేయుడు ధర్మహాని యగునపుడు స్వామి చతుర్యుగము లందు క్రమముగ సిత రక్త నీల పీత ద్యుతిరూపములతో జన్మించి ధర్మస్థాపన మొనర్చునని చెప్పి యిట్లు ముగించెను.

"నాకిమ్మైఁ బొడసూపెఁ దాను గృపతో నాకంను నేఁడియ్యెడన్
నీకున్ గాడిలి చుట్టమై సచివుఁడై నెయ్యంబుమై నున్న పు
ణ్యాకారున్ గమలాయతాక్షుఁ గరుణాకారుం ద్రిసత్యోత్తమ
శ్లోకుంగృష్ణునిఁగంటి నా సుకృతముల్ శోభిల్లెఁ బక్వంబులై."

(4-281)

ఇట్లీ ఘట్టమున స్వామి సృష్టి స్థితి లయ కారకుడగుటయే గాక, కృష్ణావతారము నందెల్లెడ పరివ్యాప్తమై యున్న శాశ్వత శిశుత్వ ప్రతీకగఁ గూడ నున్నాడు. భారతమున పలుతావుల నిట్లే ప్రసక్తిని బట్టి అవతార తత్త్వ కథనము జరిగినది. ఉద్యోగ పర్వ ద్వితీయాశ్వాసమున సంజయుడు, కృష్ణార్జునులు పరస్పరము ప్రీతితో నర నారాయణ తత్త్వ ప్రతీకలై విహరించుటను వివరించెను. అట్లే బ్రహ్మయు నొకప్పుడీ వృత్తాంతము చెప్పెను.

హరివంశాది పురాణములలో అవతరణ వ్యూహము రూప కల్పనా సహితమై వివిధ గతుల భాసిల్లినది. హరివంశము నందు భూదేవి ద్వాపరయుగావసానమున ప్రజా భారపీడితయై ఆక్రోశించెను. దేవతలు శతానందునకు చెప్పి అతని ముందిడుకొని నాగ శయనుని కడకేగి ప్రస్తుతించుట, అతడు మేల్కొని సపుడు బ్రహ్మ భూలోక పరిస్థితిని వివరించుట- జరిగినది. పిమ్మట స్వామి గరుత్మంతు నధిరోహించి సకల ముని దేవ సేవ్యమానుడై మేరు పర్వతమున నున్న కామ దోహనీ నామక సభా భవనమును ప్రవేశించి భూదేవి తన యిక్కట్లను వివరముగ చెప్పికొనగా వినెను. అప్పుడు స్వామి అవతార ప్రణాళికను నిర్దేశించెను. అందు భిన్న దేవతల అంశాదులు ప్రసక్తములైనవి. నారదుడు మధుర కేగి ఈ యవతార ప్రణాళిక నే కంసునకు వినిపించెను. తత్ప్రకార మవతరణ వ్యూహము సాగి వచ్చి క్రమానుగత కథా కథనముతో లీనమైనది. భాగవతమున కృష్ణావతరణము, కృష్ణ కథావతరణము విభిన్న దశలలో మొదటి మూడు స్కంధము లందును కలదు. అందు మున్నుగ భాగవత ప్రశంస,

యవతార విశేషములు నుక్తములై కృష్ణావతార సమాప్తియైన పిమ్మట, కలియందు భానునివలె భాగవతము జగచ్ఛ్రేయః ప్రద మగు విషయము, భిన్నయుగములందు భాగవతము ప్రవర్తితమైన పద్ధతి, వ్యాస వైయాసుల సంబంధము, పరీక్షిత్తు ప్రపత్తి, వైరాగ్యములు, భాగవతావ తరణమునకు పూర్వ రంగములై యున్నవి. అటుపై వ్యాసుని వ్యాకులత, నారదోక్త స్వీయవృత్తాంత కథనము, భాగవత నిర్మాణము కలవు. పరీక్షిత్తు జన్మ కర్మ ముక్తులు, పాండవుల మహా ప్రస్థానము, కృష్ణ కథోదయాదులు వివృతము లైనవి. దశమ స్కంధమునందు సాక్షాదవతార విషయము ప్రసక్త మైనది. గోరూప ధారిణియై[1] పుడమి బ్రహ్మదేవుని కడకేగుట, అతడామెతోఁ బాటు స్వామికడ కేగి పురుషసూక్త పఠనమున నాతని తెమల్చి అద్భుత సమాధి యందు స్వామి వాక్యమును విని దేవతలకు చెప్పుట జరిగినది. ఆతఁడు విన్న వాక్యమునుఁ బట్టి దేవతలు వారివారి యంశములందు జన్మించుట, స్వామి వసుదేవునకు పుట్టి భూభారము బాపుట, సురకన్యలు సుందరులై హరి పూజార్థము జన్మించుట, శేషుఁడు హరికళతో నగ్రజుఁడై పుట్టుట, స్వామి కార్యార్థమై మాయ నిజాంశమున పుట్టుట— ప్రధానాంశములై యున్నవి. పిమ్మట మధురయందు ప్రవర్తిల్లిన వృత్తాంతము లుక్తములైనవి. విష్ణు పురాణమున గోరూప ధారణ వృత్తాంతము లేదు. భూదేవితో దేవతలు నారాయణ స్థానమైన శ్వేతద్వీపమున కేఁగ నాతఁడు వారు చెప్పిన వృత్తాంతములను విని తన మేని యందలి ధవళాసిత రోమ యుగంబుఁ బుచ్చి యారెండును దుష్టసంహారణ సాధుగక్షణముల

1. పుడమి గోరూప ధారిణియైన వృత్తాంతము భాగవతమున ప్రత్యేకము. జనులకు గ్రాసవాసాదుల నొసఁగు భూమాతవలె క్షీర దధ్యాదుల నొసఁగు గోమాతయు. మాతృత్వ చిహ్నము. ప్రాచీన పారసీ కథలలో జరాతుస్త్ర గోరూపధారిణియైన భూమాత పిలుపు వలననే యవతరించినట్లు చెప్పఁ బడుట వలన సర్వమతముల కీ ప్రతీకా వాదము సామాన్యమని తోచుచున్నది.

(Gospel of Sri Krishna- Duncan Greenlees- Page-10 )

నొనరించునని చెప్పి తన యవతారమును నిర్దేశించెను. తత్ప్రకారమే వృత్తాంతము లన్నియు పరివర్తితము లైనవి. విశిష్ట పురాణము లందు భిన్న భిన్న దృక్పథము లున్నవి. గర్గ భాగవతమున అవతార పద్ధతుల వివరించుచు పూర్ణతమావతార పద్ధతికి గోలోకవాసియైన కృష్ణు డుదాహరణముగ నిరూపింపఁ బడినాడు. రాధా సమేతుడై సమస్త సృష్టికి కేంద్ర స్థానమున నున్న స్వామి గోరూపధారిణియైన భూదేవి యొక్కయు, దేవతల యొక్కయు విన్నపమును పురస్కరించుకొని అవతరించుట యిందలి ప్రధానాంశము. సాధారణావతరణ వ్యూహముతో బాటు ఇందు రాధావతరణమును ప్రసక్త మగుట గమనార్హము. బ్రహ్మవైవర్తము గూడ నీ ప్రణాళికనే యనుసరించినను నిందు రాధా సుదాముల పరస్పర శాప వృత్తాంతములు దోహదభూతము లైనవి. పద్మ పురాణమున శివుడు బ్రహ్మాది దేవతలతోఁ బాటు క్షీర సాగరమున కేగి అవతరణ పద్ధతుల సకారణముగ నిర్దేశించుట ప్రత్యేకము. దేవీ భాగవతమున స్వామితోఁ బాటు సమస్త దేవతా కోటులు గోరూపధారిణియైన భూదేవిని ముందిడుకొని దేవిని స్తుతించుట, యామె ప్రత్యక్షమై అవతార వ్యూహమునకు కీలకముగ వ్యవహరించుట కంగీకరించి తన్మార్గమును నిర్దేశించుట, జరిగినది. బ్రహ్మ పురాణమునందును బ్రహ్మాండపురాణము నందును అవతరణ వ్యూహములు ప్రసిద్ధ మార్గముననే యున్నవి.

సాధారణముగ అవతరణ వ్యూహము ప్రత్యేక కథావస్తువుగ నెవ్వరును తీర్చిదిద్దలేదు. కాని, సంపూర్ణ కృష్ణకథా కావ్యములు రచించిన వారనేకులు దీనిని ప్రత్యేక విషయముగ రచించిరి. అందు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య రాసలీల కావ్యమున వర్ణించిన పద్ధతి నుదాహరణముగ నెన్నవచ్చును. ఇందు కృష్ణతత్త్వావతరణము పురుషోత్తమ తత్త్వావిష్కృతిగ, శాశ్వత గోలోక లీలగ ఎప్పటికప్పుడు 'నే'నను జ్ఞాతకు సాక్షాత్కరించు తత్త్వముగ దర్శింపఁ బడినది.

ప్రతి కల్పాంతమున వ్యక్తమై మాటువడుచుండు ఈ లీల యొక్క ప్రణాళికను నలువ భాగవతోక్త ప్రకారమున విని యిట్లు నిర్దేశించి నాడు.

"అనిమిషులెల్లరున్ యదుకులాంబుధి వీచిక శీకరంబులై
జననము పొంద సర్వఋషి చంద్రులు గోగణమై చరింప, భూ
మినిగల భారమెల్లను గమింపఁగఁ జేయఁగ వాసుదేవుఁడై
ఘనతరమూర్తి విష్ణువు సుఖప్రదుఁడై యవతారమందెడిన్."

స్వామి యాజ్ఞను శిరమునఁదాల్చుచు అతని భారము తన మేన హద్దు పెట్టుటకై ఆదిశేషు డన్నయై జన్మించుట, లోకమోహిని మున్నుగ మార్గమును చూపుట- మున్నగు నీ ప్రణాళికను బ్రహ్మ యుచ్చరించుచు తన పలుకులను తానే విని యందలి స్వామి కల్పనము దర్శించెను. ఆ పథకమే భూతధాత్రికి బడలిక తీర్చి యవనికి అశరీరవాణియై కంసునకు ప్రాణహింస కాశంసియైనది. ఇట్లు చెప్పుటలో నవతార తత్త్వము నందలి తాత్త్వికాంతస్సును ముట్టుటయే కాక కథాక్లుప్తీ కరణమును, భిన్న కత్తృలందు తద్వ్యాప్తిని శిల్ప సమ్మతముగ నిరూపించుట జరిగినది.

ఈ విధముగ అవతరణ వ్యూహము భిన్న దృక్పథములతో వెలువడి అనంతర కథా వ్యాప్తికి పునాదియై యున్నది. ఇతర దృక్పథము లెన్ని ప్రస్తావింపఁ బడినను వీనిలో స్వామి విష్ణ్వంశము, ధర్మ సంస్థాపనోద్దేశము ప్రధాన విషయములుగ ఆంధ్ర వాఙ్మయమున ప్రచలితమైనట్లు గమనింతుము.

# 2. శైశవ, బాల్యలీలలు

కృష్ణకథ యందలి మధుర మనోజ్ఞ ఘట్టములలో శైశవ, బాల్యలీలలు ప్రత్యేక స్థానము నాక్రమించినవి. లౌకిక స్థాయిలో వీని మోహనతత్త్వముతోఁ బాటు వీనివలె సాహిత్య సృష్టిని, శిల్పాది కళాస్వరూపములను తాత్త్విక దర్శనమును ఉత్తేజ పరచిన కథాంశము మరి యొకటి లేదు. ప్రపంచ వాఙ్మయమునందే యిట్టి సృష్టి నభూతో న భవిష్యతి. ఈ వృత్తాంతము లందలి యాంతర్యము బహుముఖమైనది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ (ధర్మ సంస్థాపనము), మాధురీతత్త్వ మహిమాన్వితమైన జీవాత్మ పరమాత్మ సమ్మేళనము, రాజకీయ వ్యూహ రచనా నిర్వహణములు, లోకాదర్శ స్థాపనా రీతులు ఇందే సూక్ష్మ రూపమున వ్యక్తములై, తరువాతి కాలమున వివృతములై, స్వామి సర్వావతారాంశములకు సూక్ష్మ ప్రాతిపదికలై రూపొందినవి. వీని యందు శైశవ, బాల్య మాధుర్య మాహాత్మ్యములు, స్ఫురణాత్మక చర్యా విశిష్టతలు వీని ప్రశస్తికి మరింత దోహదములైనవి. ఈ యనుశీలనము నందు సౌకర్యార్థమై కంసవధ పర్యంతము నున్న ప్రధాన కథావిశేషములు చేర్పఁబడినవి. కొన్ని ఘట్టములయందితరాంశము లున్నను ఇవే ప్రధానములు కాగా భిన్న భిన్న కృత్యము లొనర్చినపుడు స్వామి వయస్సు భిన్న గ్రంథములందు భిన్నరీతుల నున్నది. ఉదాహరణమునకు- హరివంశమున స్వామి కంస వధాత్పూర్వమే నీలను వివాహమాడెను. అనగా ప్రాయము బాల్య మగుటకు వీలులేదు. ఇట్టి యంశముల చారిత్రక దృష్టితో పరిశీలించినచో అదియొక మహా సముద్రము. ప్రస్తుతానుశీలనము నకు కార్యకారియు కాదు. కావున వయోవ్యవస్థ యందలి భిన్న